## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120029494

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

“దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం” అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన ‘ఇచ్ఛ’ (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. “నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది” అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పానీయకల్పవల్లి

యస్. ఎ. టి. యమ్. శ్రీనివాసాచార్యులు
అయ్యవారులుగారి ప్రణీతము.

రాజమండ్రి బుక్కుసెల్లరు,
మాదేటి సత్యాసయ్యచే ప్రకటితము.



మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

సరస్వతీ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1913

# విషయసూచిక.

---

# ఉపోద్ఘాతము.

వైద్యసోదరులారా!

అనాది కాలమునుండియు సమస్తైశ్వర్యములతోఁ దులదూగుచుండు భారత మాతయందలి యాంధ్రదేశీయులగు ప్రాచీన వైశిఖామణులు తమ వైద్యగ్రంథములలో పానీయముల ను గూర్చియంతగా నిదివరకెవరును వ్రాసియుండలేదు. ఈ పానీయములను ఆంగ్లేయులు సిరప్పు అనియు, మహమ్మదీయులు షర్బతులనియు, ఆంధ్రదేశీయులు పానకములనియు, చారులనియు వాడుదురు. వీటిని అనేక గ్రంధములను పరిశోధించియు, నానాదేశవాసులగు వైద్యశ్రేష్ఠుల యనుభవము నుండియు బాగుగ పరిశోధన చేసి వ్రాసితిమి. ఇందలిపానీయములను స్వయముగ చేసి వాటిగుణములను కనిపెట్టి ప్రచురించితిమి.

ఈ చిన్న పొత్తమునఁ జదువు వారందరిందలి షర్బతులను పానము జేసి యనుభవించి గుణములను కనుగొని రోగవిముక్తులరై సుఖియింతురుగాత? ఇందెవ్వియైన లోపములుండె నేని క్షీరనీరములను వేరుజేయు స్వభావముగల హంసవలె గుణముల నుగ్రహించి లోపములను దయతో దెలియజేసిన కృతజ్ఞత నంగీకరించి పునర్ముద్రణమున సవరణఁజేసి ప్రకటించెదము.

ఇట్లు,

శ్రీమదళహరతిరుమల మాఢభూషిశ్రీనివాసాచార్యులు అయ్యవారులు గారు,

ఇన్నీస్పేట, రాజమండ్రి.

# పానీయములను చేయుక్రమము.

పానీయములనేకవిధములు. కొన్ని పుష్పములు, కొన్ని ఫలరసములు, కొన్ని దుంపలు, వేళ్ళు, చెక్కలు, విత్తులు పత్రములు మొదలగువాటితో చేయుదురు.

గులాబీపూవులు, కల్వపూవులు, తామరపూవులు, మొదలగు షర్బతులను చేయవలసిన ఒక సేరుసీళ్ళకు అర్థసేరు పువ్వులరేకులను దెచ్చి నీళ్ళు మరుగునప్పుడందు పైరేకులను చేర్చి అర్థసేరునీళ్ళకు మఱిగించి దించి యుండుండు రేకులను బాగుగ పిసికి వడియగట్టి పిప్పిని పారవేయవలెను. పచ్చిరేకులయిన కషాయమునకు సమముగను. ఎండిన రేకులయిన రెండురెట్లు ను బనాసు చీనాచక్కెరనుగాని, కలకండనుగాని చేర్చి తేనెపాకముగ కాచి దించుకొనవలెను.

పాలసుగంధి, వట్టివేరు, కురువేరు మొదలగువాని షర్బతుల ను చేయవలసివచ్చిన సుగంధివేరు తెల్లని బెరడునున్న వేళ్ళను చిన్నముక్కలుగా కోసియుం వలయునంతచేర్చుకొని మంచినీళ్ళలో నాలుగుజాములు నానబెట్టి పిమ్మట పొయిమీదనుంచి క్రింద మంటవేయుచు నాలుగింటనొకపాలు మిగులువరకు కాచిదించి బాగుగపిసికి వడియకట్టుకొనవలెను. ఆవడియకట్టిన కషాయమునకు రెండు రెట్లుగాని మూడు రెట్లుగాని చక్కెరను చేర్చి తేనెపాకముగ కాచి దించవలయును.

కాఫీవిత్తులు, ధనియాలు బాదాము మొదలగు విత్తులను పానీయములుగా చేయవలసివచ్చిన, కాఫీవిత్తులను, ధనియా

లును వేయించి చూర్ణించియు, బాదంపలుకులను కలసల మరుగుచుండు నీళ్ళలో పైచూర్ణములను చేర్చి మూతవేసి యుంచి పది నిమిషములయిన పిదప వడియపోసి యందుచక్కెరను చేర్చి కొందరును, పాలనుగూడ చేర్చి కొందరును పానము చేయుదురు.

ఫలములను షర్బతులను చేయవలసిన దాడిమఫలము, కమ్లాఫలము, నిమ్మపండ్లు, మామిడిపండ్లు మొదలగువానిరసములను పిండి యారసములకు సమముగ చక్కెరను చేర్చి తీగెపాకముగ కాచి దించుకొనవలెను. ఈషర్బతులకు కొందరు రంగువచ్చుటకు చినాలరంగునుకూడ చేర్చుదురు. అదియంత శ్రేష్ఠతరముగాదు. నిలువయుంచవలసిన షర్బతులను తెల్లనిసీసాలలో భద్రపరచి యుంచుకొనుట లెస్స.

గ్రంధకర్త.



శ్రీయైనమః.

శ్రీలక్ష్మీహయవదనపరబ్రహ్మణేనమః.

శ్రీధన్వంతర్యైనమః.

# పానీయకల్పవల్లి.



## 1. గులాబీ పానీయము.

గులాబీరేకులు 40 తులములు, శుద్ధజలము 48 తులములును ఒకకుండలోచేర్చి పొయిమీదనుంచి క్రిందమంటవేయుచు సన్ననిమంటమీద సగముజలముండువరకు కాచిదించి వడియకట్టి యందు 40 తులముల తెల్లచక్కెరనుచేర్చి రెండుమూడు పొంగులు వచ్చువరకుకాచి గోరువెచ్చగనుండునపుడు 5 తులముల పన్నీటినిగూడచేర్చి శుభ్రమైన తెల్లని సీసాలలో కారుక్‌బిగించి భద్రపరచవలెను.

### గుణము.

తులముమొదలు రెండుతులములవరకు అరసోలెడు శుద్ధోదకములోచేర్చి పుచ్చుకొనిన పైత్యప్రకోపమువలన వచ్చిన బలహీనతయు, కాకయు శాంతించును. అతిదాహము మానును;



## 2. కమలా షర్బతు.

తామరపూలరేకులు 1¼ పలములు నిర్మలోదకము 50 పలములును ఒకపాత్రలోచేర్చి సగపాలుజలముండువరకు సన్న

నిమంటపైకాచిదించి రేకులను బాగుగపిసికి పిప్పినిపారవైచి వడియకట్టి యాకషాయమున తెల్లచక్కెర 28½తులములను చేర్చి తేనెపాకముగాకాచి గాజుసీసాలో భద్రిపర్చవలెను. మాత్రి పలముమొదలు రెండుపలములవరకు వాడవచ్చును.

## గుణము.

వేడివలనగలిగెడి తలనొప్పి, దగ్గు, పైత్యమువలనగలిగెడి వమనము, నరుసు దబ్బయందలివాపు, ప్రిక్కవాపు, రొమ్ము ఎండిపోవుట, ముఖకాంతితగ్గుట, ఆయాసము మొదలగునవి హరించును.

## 3. రెండవవిధి.

ఎర్రితామరపూలరేకులు ఎండినవియైన 13 పలములు పచ్చివియైన 52 పలములును శుద్ధోదకము 25 పలములును పాత్రలోచేర్చి పైప్రకారము కాచి యందు చక్కెర 25 పలములనుచేర్చి తేనెపాకముగవండి సీసాలోచేర్చవలెను. మాత్ర ఒక పలము మొదలు $1\frac{1}{2}$ పలము వరకు వాడవచ్చును.

## గుణము.

తలనొప్పి, పైత్యజ్వరము, పుల్లదబ్బయందలివాపు, స్త్రీల కుసుమరోగము, ఋతునూల మొదలగునవి హరించును.



## 4. కుముదా షర్బతు.

తెల్లకలువగాని, ఎర్రకలువగాని, నల్లకలువగాని, పచ్చితే పలను52 పలములు, శుద్ధజలము 25 పలములును చేర్చినగవా

మిగులువరకు కషాయమును గాచిదించి వడియకట్టియాకషాయమున 25 పలముల చీనాచక్కెరమచేర్చి మధుపాకముగ వండి సీసాలో భద్రపరచవలెను. మాత్ర రెండుపలములు మొదలు మూడుపలములవరకు వాడవచ్చును.

## గుణము.

తెల్లకుసుమకు తెల్లకల్వపూలషర్బతును, ఎర్రకుసుమకు ఎర్రకల్వపూలషర్బతును, నల్లకుసుమకు నల్లకల్వపూలషర్బతును, పైప్రకారము వాడిన స్త్రీల కుసుమరోగములన్నియు హరించును.

ఎర్రకల్వపూలషర్బతును మూర్ఛలు అపస్మారములు పైత్యోన్మాదములు మొదలగువారికిచ్చిన నివారణముచేయును.



## ౮. బదరీకుసుమ పానీయము.

గంగరేగిపూవులు 3 పలములు 30 తులముల శుద్ధజలములో చేర్చి పొయిమీదనుంచి సన్ననిమంటవేయుచు సగము మిగులువరకు కాచిదించి యందు 15 తులముల చీనాచక్కెరను చేర్చి తేనెపాకముగవండి సీసాలో భద్రపరచి యుంచేది.

మాత్ర అరతులము మొదలు తులమువరకు వాడవచ్చును.

## గుణము.

రక్తమండలి యుష్ణము, రొమ్మునొప్పి, పాడిదగ్గు, పొక్కులు, జిహ్వారోగములును హరించును.



## 6. కమలాఫలపానీయము (కమలాఫలషర్బతు)

కమలాఫలములను బాగుగపండిన వానిని దెచ్చి పైచర్మమును లోపలినరములను విత్తులను తొలగించి రసమును పింగానిలోపిండి సమపాలు చక్కెరనుచేర్చి తేనెపాకముగకాచియందు సేరుకు 5 తులముల పన్నీరును రెండుతులముల యేలకి చూర్ణమునుచేర్చి సీసాలో భద్రపర్చవలెను.

మాత్ర తులముమొదలు రెండు తులములవరకును వాడవచ్చును.

### గుణము.

విరేచనమగును. అరుచిని బోనడచును. రక్తమును శుభ్రపరచును. కన్నులకు చల్వచేయును.



## 7. కపిత్థపానీయము (వెలగపండ్లషర్బతు)

బాగుగచెట్టును పండిన వెలగపండ్లలోని గుజ్జురు 50 తులములు శుద్ధజలము 52 పలములును బ్రాయిబిూదనుంచి సలసల మరుగుచుండునపుడు నాల్గింట మూడుపాళ్ళుమరగనిచ్చి దించి బాగుగ పిసికి యందలిపిప్పిని నరములను విత్తులను పారవైచి వడియకట్టి యాకషాయమున 52 పలముల తెల్లచక్కెరనుచేర్చి తేనెపాకముగ కాచి సీసాలలో భద్రపరచవలెను.

మాత్ర రెండుతులములు మొదలు మూడుతులములవరకు వాడవచ్చును.

## గుణము.

అతిదాహము, పైత్యోద్రేకము, రక్తమందలి యుష్ణము, అరుచి, సిరఘుపోట్లు, తలనొప్పి, విషదోషములు, రసము పాషాణములు మొదలగువాని యుపయోగములవలన కలిగెడి ఆ పాయములు మొదలగునవి హరించును. విరేచనముచేయును. జిహ్వాదోషములను తొలగించును. కన్నులకు చల్వచేయును. మేహశాంతిజేయును.



౭. జంబీరఫల పానీయము (నిమ్మపండ్లషర్బతు)

నిమ్మపండ్లరసము, గంగరేగుపండ్లరసము, చింతకాయలరసము ఫుల్లదాడిమ ఫలములరసము. తియ్యదానిమ్మపండ్లరసమును దినుసుకు 13 పలములవంతున అన్నిటినొక పాత్రలో చేర్చి పిసికి వడియకట్టి దానిలో తెల్లపంచదార 13 పలములను చేర్చి పొయ్యిమీదనుంచి యొకపొంగురాగా నేదించి తిరుగ వడియకట్టి ప్రొయ్యిమీదనుంచి యందు అగరుచెక్కచూర్ణము రెండువరహాలయెత్తు పిస్తాపప్పు మీదిజారము రెండున్నర వరహాలయెత్తు మూర్ణమును షర్బతులోచేర్చి మధుపాకముగ కాచిదించి సీసాలలో భద్రపర్చవలెను.

మాత్ర వకటిన్నర తులము మొదలు రెండున్నరవరకును వాడవచ్చును. రెండు వేళల యివ్వవచ్చును.

## గుణము.

పైత్యకాక, మేహకాక, కాస, రక్తకాస, శ్వాసయు

హరించును. వల్లగుండెకు, హృదయమునకు, అన్నాశయము నకును బలమిచ్చును. పైత్యమువల్ల గలుగు మంట, అరోచక మును పోగొట్టును. విషజ్వరములను హరించును. కైపువస్తు వులను వాడుకచేయువారికి యితరౌషధములు పనిచేయనివే శల యీషర్బతును వాడవచ్చును.



## ౨. నారంగఫలపానీయము. (మాదీఫలషర్బతు)

మాదీఫలములోని పీచు మెత్తనయిన తెల్లనిపదార్థము 13 పలములు మంచినీళ్లు ఒకపడి (మూడుఅర్థసేరులు) బా గుగా కాచిన గట్టితేనె 13 పలములు.

### చేయువిధానము.

పై మాదీఫలపుపీచును శుద్ధోదకమున ఒకదినము నానబె ట్టి మరునాడు కాచి మూట రెండుపాళ్ళు యిగిరినతరువాత దించి వడియకట్టి దానిలో తేనెనుబోసి పానీయపాకముగ కాచిదించి సీసాలోభద్రపరచి యుంచవలెను. మాత్రి 1½ తులముమొదలు రెండుతులములవరకు నుపయోగించవచ్చును.

### గుణము.

హృదయకమలము, అన్నకోశముకు బలపరచును. రక్త మును శుభ్రపరచును. అరుచిని బోనడచును. పైత్యమును హ రించును. కాలవిరేచనము జేయును.

## 10. మరియొకవిధము.

మాతీఫలరసము 6 పలములు (గావుజుబాన్ ద్రావకము) 7½ పలములు చీనాచక్కెర 7½ పలములు కుంకుమపూవు పావుతులమును.

### చేయువిధి.

గావుజుబాన్ పానీయములో చీనాచక్కెరను చేర్చి కాచి పైతెట్టెను దీసి పారవైచి ముదరపాకములో మాతీఫలరసమును చేర్చి రెండుమూడుసారులు పొంగినపిదప దించి కుంకుమపూవును పన్నీరుతో మదించి పైషర్బతులో చేర్చి బాగుగ కలిపి కారుక్కగల సీసాలలో భద్రపర్చవలెను. మాత్ర ఒక పలము.

### గుణము.

నికారకలు, మేహకారకములు, పైత్యములను తొలగించును. ఆహారకోశము గుండెకాయలను బలపరచును. మెదడును సమశీతోష్ణముగ నుంచును. కన్నులకు చలవజేయును.



## 11. అంజూరాపానీయము.

సీమమేడి లేక అత్తిపండ్లు వీ 1 సెనగలు వీ ¼ శుద్ధిచేసి ౨ తేనె వీ 1 చలవమిరియాలు తు ¼ లవంగాలు తు ½ యాలుకలు ½ దాలిచిని తు ¼ జటామాంసి తు ¼ సన్నరాష్ట్రిం తు ½ కుంకుమపువ్వు ¼.

### చేయువిధము.

సెనగలను $4\frac{1}{2}$ సేరుల శుద్ధజలములో వేసి ప్రాయిమీాదనుంచి క్రింద మంటవేయుచు మూటనొకపాలుగ కాచి దించి బాగుగ పిసికి పిండి వడియకట్టిన కషాయములో మేడిపండ్లను చేర్చి యుడికించి దించి బాగుగ పిసికి వడియకట్టియుంచి యందు తేనెను బోసి ప్రాయిమీాదనుంచి క్రింద సన్నముగ మంటవేయుచు పైవస్తువులను బాగుగ చూర్ణించి ఒకదానివెనుక మఱియొకచూర్ణమును చేర్చుచు లెస్సగ కలియబెట్టి దించవలెను. పిమ్మట కుంకుమపువ్వును పన్నీటితో నూరి పైపాకమునజేర్చి కలియబెట్టి జాడీలలో భద్రముచేయావలెను. మాత్ర పలం $\frac{3}{4}$ మొదలు పలమువరకు వాడవచ్చును.

### గుణము.

శక్తిపుష్టి, వీర్యవృద్ధి, పటుత్వమును గలిగించును. గుండెకాయకు బలమిచ్చును. బుద్ధిని వికసింపజేయును. మూత్రకోశము, నడుము, వెన్ను మొదలగువానికి బలమిచ్చును. వానియందలి రోగములను హరించును.



## 12. ద్రాక్షాఫలపానీయము.

పచ్చిద్రాక్షపండ్లు 20 ఫలములు ఎండిన సీమఅత్తిపండ్లు 16 పలములును ఆరుపళ్ళ లేక తొమ్మిదిసేర్ల నీళ్ళలో వేసి ప్రాయిమీాదనుంచి సగపాలు మిగులువరకు కాచి దించి స

న్నని శుభ్రమైన తెల్లని వస్త్రములో బోసి మూటవలె గ ట్టి వ్రేలాడగట్టి దిగువ నొకపాత్రముసుంచిన తేటనీరు వడి యును. ఆ తేటనీటియందు 10 పలములు చీనాచక్కెరను చేర్చి పానీయపాకముగ కాచి కార్కుగల సీసాలలో సేకరిం చవలెను. మాత్ర ఒకపలము మొదలు 1½ పలము వరకు.

## గుణము.

హృదయము, నల్లగుండెలయందలి యుష్ణమును తొల గించును. పైత్యహరముజేయును. గుండె అదురును బోనడ చును. రక్తమును శుభ్రపరచి వృద్ధిచేయును. శుక్లమును వృ ద్ధిచేసి గట్టిపరచును.



## 13. చూతఫలపానీయము. (మామి డిపండ్లషర్బతు)

బాగుగపండిన తియ్యని నారలేని మామిడిపండ్లరసము 19 పలములు కలకండ 5 పలములు నీళ్ళుకలియని ఆవుపాలు 1) పలములు, యాలకులు, చలవమిరియాలు, దాలిచిని, కుంకు మపువ్వు, పచ్చకర్పూరము, జాజికాయ యివి దినుసుకు పా వుతులము.

### చేయుపద్ధతి.

మామిడిపండ్లరసము పాలును ఒకపాత్రిలో చేర్చి పొ యిమీద నుంచి పొంగి పాయిలో పడకుండ సన్నని మంట

పై కాచుచు మూడుపాంగులు వచ్చినపిదప దించి వడియాక ట్టి యందు కలకండను చూర్ణముగావించి చేర్చి షర్బతు పాకవిధిగ కాచి దించి యందు పైదినుసులను చూర్ణించి వరుసగ చేర్చి బాగుగ కలియబెట్టవలెను. కుంకుమపువ్వు ప చ్చకర్పూరము కస్తూరియు పన్నీటితో మర్దించి పైపాలు నందుచేర్చి కలిపి సీసాలయందు భద్రపరచి యుంచవలెను. మాత్ర 1½ పలము మొలుద 3 పలములవరకు వాడవచ్చును.

## గుణము.

నపుంసకత్వముపోవును. గ్రహణీరోగము, క్షయ, కాస, శ్వాస, అరుచి, ఆమ్ల, పైత్యము, రక్తపైత్యము, పాండురోగ ములను బోనడచును. విరేచనముజేయును.



## 14. లశునపానీయము. (ఉల్లిషర్బతు)

తెల్లగనుండు నీరుల్లిగడ్డలు వీ 1 ను దంచి రసమును త సమునకు రెండురెట్లు శుద్ధిచేసిన మేలయిన తేనెయు నొక పాత్రమున జేర్చి ప్రాయిమీదనుంచి సన్నముగ మంటవేయు చు షర్బతుపాకముగ వచ్చునపుడు దించి యందు యాలకు లు, లవంగాలు, చలవమిరియాలు, కుంకుమపువ్వు, పచ్చక ర్పూరము దినుసుకు అరతులమువంతున చూర్ణించి చేర్చవ లెను. కుంకుమపువ్వు, పచ్చకర్పూరమును పన్నీటితోనూరి యందుచేర్చి కారుక్గల సీసాలో భద్రపరచి యుంచవలె

సు. మాత్ర ముప్పావుతులము మొదలు తులమున్నరవరవలెను. రాత్రి భోజనానంతరమున సేవించవలెను.

## గుణము.

ఇంద్రియము అధికముగ నూరును. రమించినపిదపగలిగెడి బలహీనత, ఆయాసము సోమరితనమును తొలగించును. శీతలదేహులకిది మిక్కిలి ప్రయోజనకారి. సంయోగానంతరమున నీళ్లు త్రాగెడివాడుక అనేకులకుగలదు. అది పెక్కురోగములను పుట్టించుటకు ముఖ్యకారణము. అట్టివారి కీపానీయము మిక్కిలి మేలుజేయును. బలమిచ్చును.



## 15. నీపాదిపానీయము. (నేలతాడిషర్బతు)

పచ్చినేలతాడిగడ్డలు, పచ్చి నేలగుమ్మడుదుంపలు, రేనుగపల్లేరుకాయలును దినుసుకు అర్ధసేరువంతున దంచి యాకలక్రమును ఒకపడి శుద్ధజలమునచేర్చి భాండమును ప్రొయిమీదనమర్చి మూట నొక రెండుపాళ్లు మిగులువరకు కాచి దించి వడియకట్టి యాకషాయమున 10 పలముల కలకండచూర్ణమును చేర్చి పానీయపాకముగ కాచి దించునప్పుడొక తులము పొంగించిన పటికచూర్ణమును చేర్చి బాగుగ కలిపి సీసాలో భద్రపరచవలెను. రాత్రి భోజనానంతరమున నొక తులము పానీయమును వేరున్నర ఆవుపాలలో చేర్చి పానము చేసిన వీర్యము స్తంభించును.



## 16. శిగ్రుపుష్పపానీయము (ములగపూలషర్బతు)

పావుసేరు ఆవుపాలు, చారెడు ములగపూవులు, తులము కలకండ.

### చేయుక్రమము.

పాలను కళపెళ కాగనిచ్చి యందు పై ములగపూలను చేర్చి యుడికించి దించి బాగుగ పిసికి పిప్పిని పారవైచి యందు కలకండచూర్ణమును చేర్చి రెండుపొంగులు రానిచ్చి దించి యుదయమున సేవించేది. పిమ్మట లేతదగు ములగాకును పిడికెడు దెచ్చి కాడలు యీనెలును తొలగించి వేడియన్నమువీూద వేసి యాయన్నముతో కల్పి భక్షించేది. పథ్యం ఉలుపుకారలు, సూనె, గుమ్మడు, ఆవ, బచ్చలి వగయిరాలు కూడదు.

### గుణము.

నపుంసకునికి పుంస్త్వము గలుగును. ఇంద్రియపాటవత నొసంగును.



## 17. బదరీఫలపానీయము. (రేగుపండ్లషర్బతు)

పెద్దరేగుపండ్లు (గంగరేగుపండ్లు) 13 పలములు, నిర్మలోదకము 2 పడ్లు (మూడుసేర్లు) తెల్లని చీనాపంచదార 26 పలములు.

## చేయువిధము.

పండ్లలో విత్తులను తీసి పారవైచి పండ్లను శుద్ధజలము లోనుంచి ప్రాయిమీదబెట్టి క్రింద సన్నముగ మంటవేయు చు మూటనొకపాలు నీళ్ళు మిగులువరకు కాచి దించి చేతి తో పండ్లను బాగుగ పిసికి పిప్పిని పారవైచి కషాయము వ డియగట్టి యాకషాయమున చక్కెరనుచేర్చి పానీయపాకము గ కాచి దించి సీసాలో సేకరించవలెను. మాత్ర తులమున్నర మొదలు 2 తులములవరకు.

## గుణము.

చిడుముకురుపులు హరించును. పొడిదగ్గు, రొమ్మునొప్పి, శిరోవాతము, నేత్రదాహము, అరికాళ్లు, అరచేతులు, మంట మొదలగునవి హరించును. రక్తమందలి యుష్ణతీవ్రము హరిం చి సమముగనుండును, అరుచినిబోగొట్టును.



## 18. అమలక పానీయము (ఉసిరికషర్బతు)

బాగుగముదిరిన ఉసిరికాయలు రెండుసేరులు, తేనె అరవీ శ, కలకండ అరవీశ.

## చేయువిధము.

ఉసిరికపండ్లలోని విత్తులను తొలగించి పాఱవైచి ఫలము లను శేరున్నర శుద్ధోదకమున చేర్చి పాత్రనుప్రాయిమీదనుంచి మూటనొక పాలుకు కాచి దించి బాగుగ పిసికి పిప్పినిపారవై చి కషాయమును వడియగట్టి యందు కలకండ చూర్ణమును

చేర్చి పాకమువచ్చునపుడు తేనెనుగూడాచేర్చి పానీయపాకముగకాచి దించి సీసాలో సేకరించవలెను. మాత్ర తులము మొదలు రెండుతులములవరకు వాడవలెను.

## గుణము.

అరుచినిజోగొట్టును, కాలవిరేచనమునుజేయును, రక్తమును శుద్ధిపరచును, హృదయమునకుబలమిచ్చును.



## 19. అలుబుకారాపానీయము (ఆల్బకార్రిపర్బతు)

పుట్లు, విత్తులు మొదలగువానిని తొలగించినీళ్లలోనానవేసినపిమ్మట నన్నని శుభ్రిమగు వస్త్రమునగట్టి వ్రేలాడదీసిన సారము పది తులములు, అట్లనేచేసిన చింతపండు తేటనీరు 2 తులములు శుద్ధిచేసి సీమ తెగడచూర్ణము బనఫుషా యివిదినుసుకు 5 తులములు, 25 పలములచీనాచక్కెర.

## చేయువిధము.

సీమతెగడచూర్ణము బనఫుషాయున్ను కిత్తనారగుడ్డను ముడివేసి ఒకటిన్నర పడినీళ్లువేసి అరపడినీళ్లకుకాచి కాచునప్పుడు మూటను తెడ్డుతో బాగుగ రాచుచు దించి పై అలుబుకారాసారము, చింతపండుసారమునుగూడ జేర్చియందుచక్కెరను చేర్చి పానీయపాకముగ కాచి నురుగుమతీసి తొలగించి చల్లారినపిదప పింగానీయందుంచవలెను. అందుశుద్ధిచేసిన మరియూడా కుంకుమపువ్వు దినుసుకురెండు వరహాలయెత్తును చేర్చవలెను. మాత్ర తులముమొదలు తులమున్నరవరకు.

## గుణము.

చిలర బోగొట్టునుకాలవిరేచనము చేయును, జిహ్వాదోషములను గొలును, పైత్యములనుహరించును.



## 20. నూనాదిషర్బతు.

పైపొరను తీసి తొలగించిన అతిమధురము 2½ పలములు, దోసవిత్తులు ధనియాలు బొడ్డుపావిలివిత్తులు మేడిపండ్లవగరుజున్ను యివిదినుసుకు 1 పలం, చక్కెర 15 పలములు.

చేయువిధము.

చక్కెరగాక మిగిలిన వస్తువులను నలియగొట్టి రెండుపళులేకమూడుసేరులు నీటిలో నొకపగలంతయు నానవేసి పాత్రి యిమీదనుంచి మూటనొకపాలుగకాచి దించిబాగుగపిసికివడియగట్టి యీకషాయములో చక్కెరను చేర్చి కాచి పాకమును జూచి దించుకొనవలెను. మాత్ర 2 తులములు మొదలు 3 తులములవరకు వాడవచ్చును.

## గుణము.

దగు, ఎగశ్వాస, నీరుచురుకు, కట్టు మొదలగునవి హరించును.



## 21. నారింజపానీయము.

బాగుగపండిన తియ్యని నారింజపండ్లను వొలిచి లోపలి తొనలను పిండినరసము 15 పలములు, తెల్లచక్కెర 15 పలము

లు. జీలకర 5 తులములు తేనె 15 తులములు, శుద్ధజలము 15 తులములును.

### చేయువిధము

శుద్ధజలమును నారింజరసమును పాత్రిలోబోసి ప్రొయి మీదనుంచి మూడుపొంగులు వచ్చినపిమ్మట చక్కెరనుచే ర్చి షర్బతు పాకముగవండి యందు తేనెను జీలకరచూర్ణమును చేర్చి పానీయపాకముగ వచ్చుట జూచి సీసాలో భద్రపర చవలెను. మాత్రి తులముమొదలు రెండుతులములు.

### గుణము.

నిశాకలు, దేహతాపములు, అరుచి, అగ్నిమాంద్యము నుబోనడచును. తలపోట్లు చిడుము దద్దురులు మొదలగు చర్మ రోగములను బారదోలును.



## 22. తింత్రిణీపానీయము.

ఉప్పు, పిక్కలును తొలగించిన క్రొత్త చింతపండు 10 పలములు, శుద్ధోదకము మూడుతవ్వలు (40 పలములు) ఎర్రికల కండ 20 పలములు.

### చేయువిధము.

శుద్ధజలములో చింతపండును వేసి బాగుగ పిసికి పిప్పినిపా రవైచి కలకండను చేర్చి పొయిమీదనుంచి పానీయపాకము గవచ్చినపుడు దించి జాడీలోనుంచవలెను. మాత్రి ఒకటిన్నర తులము మొదలు తు 3 వరకు.

## గుణము.

పైత్యకాక, చర్మరోగము మొదలగునవి హరించును. కాల విరేచనమగును. అన్నకోశమును దృఢపరచును.



## 23. నక్కెరుపండ్లషర్బతు.

10 పలముల నక్కెరుపండ్లు తెచ్చి 10 పలముల శుద్ధోదకము నచేర్చి మూటరెండుపాళ్లు మిగులునట్లు కాచి దించి బాగుగపిసికి పిప్పిని పారవైచి కషాయమునకు సమము తెల్లచక్కెరను చేర్చి లేతపాకముగ కాచిదించవలెను. మాత్రి తు 1 మొదలు తులముప్పర వరకు.

## గుణము.

పొడిదగ్గునుగొట్టును. శైత్యరోగమును పారదోలును. వీర్యవృద్ధి, భోగశక్తియు గలిగించును.



## 24. దాడిమఫల పానీయము.

బాగుగపండిన పుల్లని దానిమ్మపండ్లను వొలిచి లోపలివిత్తులను గుడ్డలోమూటకట్టి బాగుగ పిసికి రసము నొకపింగాని లోపిండవలెను. 10 పలముల రసమునకు అరతులంయాలకిపండ్లలోవిత్తులు తవాక్షీరి తు 1, పచ్చకర్పూరం 4 చిన్నములు, కుంకుమపువ్వు 6 చిన్నములును 4 తులముల పన్నీటితో మర్దించవలెను.

### చేయువిధము.

ఆరవీసెడు కలకండను చూర్ణించి సోలెడు నీళ్లలో చేర్చి పొయిమీదనుంచి రెండుపొంగులు వచ్చినపిమ్మట పైదాని నిమ్మపండ్లరసమును పన్నిటికలుపును చేర్చి దించి శుభ్రమగుసీసాలో పోయవలెను. మాత్ర ఒకటిన్నర తులము మొదలు తు 2 వరకు.

### గుణము.

దేహమందలివేడిమి, పైత్యకాక, పైత్యవికారము, పిత్తజ్వరములను హరించును. వడగొట్టినవారికిచ్చిన వడతీరును. అరుచి, అగ్నిమాంద్యములను తొలగించును.



## 25. నిమ్మపండ్లషర్బతు.

బాగుగపండిన పెద్దవియగు పచ్చని పాలకొల్లు నిమ్మపండ్లను ముప్పదింటిని రసమొకపింగాణిపాత్రయందు పిండి యందు ఒకతులము జీలకరను పైరసముతో లెస్సగనూరి తెల్లచక్కెర 30 పలములు, అల్లపునిజరసము 15 తులములు, తేనె 25 తులములు శుద్ధజలము 7 పలములు కలిపి మూడు పొంగులు వచ్చువరకుకాచి పొయిమీదనుండగనె మిగిలిన నిమ్మపండ్లరసమును చేర్చిదించి వెంటనే వడియకట్టి సీసాలో భద్రపరచవలెను. మాత్ర రెండుతులములు మొదలు మూడు తులములవరకు.

## గుణము.

దారుణపైత్యములు, మేహకాక, అరుచి, దాహము, నో టిలె యిగురు, కంపు మొదలగు వానిని బోనడచును. కండ్లకును, కపాలమునకును చలువజేయును. పాదదాహము, నేత్రదాహము హరించును.



## 26. కర్యూజా పర్బతు.

లెస్సగపండిన కరిపుచ్చకాయలలోని విత్తులను తొలగించి ఎర్రని గుజ్జునుతీసి గుడ్డను మూటకట్టి యొకపాత్రలోనుంచి చేతితో బాగుగరుద్ది రసమునుపిండి యుంచవలెను. ఆరసము 20 పలములు, తెల్లచక్కెర 30 పలములు, పన్నీరు 20 పలములును ఒక పాత్రలో చేర్చి ప్రొయిమీదనుంచి 4, 5 పొంగులు వచ్చువరకు కాచి వడియకట్టి సీసాలలో బోసి బిరడాలచే బిగించవలెను. మాత్ర ఒకటిన్నర పలము మొదలు 3 పలములు.

## గుణము.

దారుణమేహములు, మేహకాకలు తగ్గును. దాహముకట్టును అరుచినిబోగొట్టును.



## 27. పల్లేరు పర్బతు.

చిరుపల్లేరు సమూలమును తెచ్చి నీళ్ళలో బాగుగకడిగి రోటిలోలెస్సగదంచి రసముపిండి వడియకట్టవలెను. ఆరసము 20 పలములు, చీనాచక్కెర వీ 1. శుద్ధిచేసిన తేనె 20 పలాలు.

చేయువిధము.

అన్నిటి నొకపాత్రలోఁచేర్చి పానీయలేహ్యపాకముగ కాచి దించియుంచవలెను. మాత్ర 1 పలముమొదలు 2 పలములవరకు.

గుణము.

శర్కరమేహము, అశ్మరీ, నీరుకట్టు, నీరుచురుకు, మూత్రాఘాతము మొదలగువాని బోనడచి భోగశక్తినిచ్చును.



28. సునాముఖీ పానీయము.

1 పలము సునాముఖీ ఆకును 5 పలముల నీళ్ళలోఁ వేసి పొయిమీదనుంచి మూఁట నొకపాలు మిగులునట్లు కషాయమును కాచి వడియకట్టవలెను. ద్రాక్షపండ్లు 5 పలములు వేడి కషాయమునచేర్చి బాగుగ పిసికి పిప్పిని పారవేసి తిరుగ వడియకట్టుకొని యందు 15 పలముల కలకండను చేర్చి పానీయపాకముగ కాచి దించవలెను. 1 తులము కుంకుమపువ్వును పన్నీటితోఁ నూరి యందుచేర్చి సీసాలోఁ భద్రపర్చవలెను. మాత్ర తు 1 మొదలు వకటిన్నరవరకు వాడవచ్చును.

గుణము.

విరేచనము జారీచేయును. శరీరమును తేలికపరచును. జీర్ణశక్తినిచ్చును.



29. పుదీనా షర్బతు.

పుదీనాఆకు పసరు పాలు నిమ్మపండ్లరసం సగముపాలు పంచదార వకపాలు.

చేయువిధము.

పయి పసరును రసమును కలిపి పొయిమీదనుంచి కాచునపుడు కొంచెము కొంచెముగా పకెర్రను చేర్చుచు విడువకుండ తెడ్డుతోగాని అబకతోగాని కలుపుచుండవలెను. పంచదార అంతయు చేర్చిన పిమ్మట లేపాకముగా వచ్చునపుడు దించి సీసాలో భద్రపర్చవలెను. మాత్ర 1 తులము మొదలు రెండు తులములువరకు.

## గుణము.

అన్నహితవును పుట్టించును. పైత్యమును తొలగించును. సులిపురుగులను గొట్టును. పేగుసలరచుట, అపానవాయువులు విడుచుట మొదలగునవి మానును. ఎక్కిళ్ళు తగ్గును. నల్లగుండె అన్నాశయములను బలపరచును. కండ్లకుచలవచేయును.



## 30. శీకాయ షర్బతు.

మూడుపలములు శీకాయాకు 5 పలములశుద్ధోదకము పదిపలముల చీనాకలకండ, ఒకపలము జీలకర.

చేయుపద్ధతి.

శీకాయాకును శుద్ధజలము నొకపాత్రలోచేర్చి ప్రొయిమీదనుంచి క్రిందమంటవేయుచు నుడికించి దించి బాగుగపిసికిపిప్పినిపారవైచి వడపోసిన కషాయమున్ను తిరుగప్రొయిమీదనుంచి కలకండను చేర్చి లేబాకముగ కాచి. జీలకరను మెత్త

గనూరి యందు చేర్చిదించి సీసాలో భద్రపరచవలెను. మాత్ర తు 1 మొదలు తులమున్నరవరకు.

## గుణము

అన్న మందిష్టతగలుగును. పైత్యముహరించును. శ్లేష్మమును గొట్టును. విరేచనముచేయును. కపాలమందలి యుష్ణమును తొలగించును.



## 31. ఏలాది పానీయము.

ఏలకికాయలలోనివిత్తులు, చందనము, వుసిరికెవరుగు, ధనియాలు, లవంగాలు, చలవమిరియాలు, దాల్చిని.

### చేయుపద్ధతి.

పైదినుసులను దినుసుకు రెండున్నర పలములవంతున బాగుగ నలియగొట్టి రెండుపళ్లు మంచినీళ్ళలో ఒకనాటి రాత్రి యంతయు నానబెట్టి మరునాడు ప్రాయిమీదనుంచి మూడింటనొకపాలుగ కషాయమును కాచిదించి లెస్సగపిసికి వడియగట్టి యందు 20 పలముల చీనాకలకండను చేర్చి తిరుగ పొయిమీదనుంచి 1 పొంగురాగానె దించుకొని వడియకట్టి పాకలకాచి లేబాకముగావచ్చునపుడు దించవలెను అందు తు 1 పచ్చకర్పూరము తు 1 కుంకుమపువ్వును పన్నీటితో నూరి చేర్చి సీసాలలో భద్రపరచవలెను. మాత్ర తులము మొదలు రెండుతులముల వరకు వాడవచ్చును.

### గుణము.

పిత్తజ్వరము మేహముజ్వరములు, నికాలికలును హరించును. శుక్లము స్తంభించివృద్ధిచేయును. కాలవిరేచనము చేయును.



## 32. రత్నపురుష పానీయము.

రత్నపురుష మొక్కలు 10 పలములు శుద్ధోదకము 15 పలములు చీనాకలకండ 30 పలములు కుంకుమపువ్వు 1 పలము పచ్చకర్పూరము రెండుతులములు.

### చేయుపద్ధతి.

కాయలు పువ్వులు వేళ్లు మొదలగువానితోపచ్చివి తెచ్చి బాగుగ నీళ్లతోకడిగినవి 10 పలములును దంచినముద్దయును శుద్ధోదకము 15 పలములు నొకపాత్రలోచేర్చి పొయిమీద నుంచి మూటనొకపాలుగ కషాయమును కాచి దించి వడియపరచిన కషాయమును తిరుగప్రొయిమీదనుంచి కలకండను జేర్చి తేనెపాకముగ కాచి దించి యందు పచ్చకర్పూరమును కుంకుమపువ్వును పన్నీటనునూరి జేర్చి సీసాలోభద్రపరచవలెను. మాత్రి తు 1 మొదలు రెండుతులములవరకు వలయునన్ని ఆవుపాలుతోచేర్చి పుచ్చుకొనవలెను.

### గుణము.

శుక్లనష్టము కట్టును. వీర్యవృద్ధి చేయును. స్తంభించును నడుముమునిల్వకుండుట కాళ్ళుతీత అరికాళ్ళు అరచేతులుమంట మొదలగునవి హరించును. భోగశక్తి యధికము చేయును.

## ౩౩. రేలగుజ్జు షర్బతు.

బాగుగ పండిన పాముగాటి రేలపండ్లలో గుజ్జు విత్తులు తీసిన ద్రాక్షపండ్లు యివి దినుసుకు 8 పలములు, కాచాకు పసరు కాశినయాకు పసరును దినుసుకు 7 న్నర పలములు. తెల్లచక్కెర 1 పలము.

### చేయుపద్ధతి.

పైరెండు పసరుల నొకటిగచేర్చి సారమంతయు వచ్చువరకు లెస్సగ పిసికి వడియపరచి పంచదారను చేర్చి పొయిమీదనుంచి తేనెపాకముగ వచ్చునప్పుడు దించి సీసాలలో భద్రపర్చవలెను.

మాత్ర 2 పలములు మొదలు రెండున్నరవరకు వాడవచ్చును.

### గుణము.

మలబద్ధమును గొట్టును. హృదయము మెదడు వీనికి బల మిచ్చును. ప్రేగులు నులుమునట్లు చేయుబాధలను తొలగించును.



## 34. సుగంధి పానీయము.

పచ్చిపాల సుగంధివేరు 15 పలములు గులాబీపూల రేకులు 5 పలములు, నాగకేసరములు 2 పలములు, యేలకికాయలు 2 పలములు, శొంఠి పావుతులము జాపత్రి పావుతులం తాళీసపత్రి పావుతులం ఆకుపత్రి అరతులం శతావరి 1 పలము.

### చేయుక్రియ.

పై దినుసులను లెస్సగ నలియగొట్టి రెండుశేరుల శుద్ధోదకమునజేర్చి పావుసేరునీళ్ళకు కషాయమునుకాచి యందు పంచదారను చేర్చి యొక పొంగువచ్చునపుడు దించి వడపోసి శుభ్రమగు సీసాలోజేర్చి యుంచవలెను.

మాత్ర తు 2 లు మొదలు 3 తులములవరకు సేవింపవచ్చును.

### గుణము.

మేహావ్రణములు, చర్మవ్యాధులును హరించును. శరీరపుష్టి కాంతియు నిచ్చును.



## 35. పిరంగిచెక్క పర్బతు.

పచ్చిదిగాని ఎండినదిగాని పిరంగిచెక్క 40 పలములు, ఏలకికాయలలోని విత్తులు 1 పలము, లవంగాలు 1 పలము, ఆకుపత్రి 1 పలము, సెవ్వం 1 పలము శొంఠి, 1 పలము, పిప్పళ్లు 1 పలము, మిరియాలు 1 పలము, పిప్పలికట్టె 1 పలము, జాజికాయ 1 పలము, జాపత్రి 1 పలము, చిత్రమూలము 1 పలము.

### చేయుక్రియ.

పైవస్తువులను బాగుగ చితకగొట్టి 5 పళ్ళ నీళ్ళలో చేర్చి రాత్రియంతయు నానజెట్టి మరునాడు పొయిమీదనుంచి సేరునీళ్ళకుదించి లెస్సగపిసికి పిప్పినిపాఱవైచి వడియుపరచిన కషాయమున 40 పలముల పంచదారను 20 పల

పలల తేనెయు చేర్చి ౩-౪ పొంగులు వచ్చువరకు కాచి దించి వడపోసి సీసాలో భద్రపర్చవలెను.

మాత్ర పూటకు తులంమొదలు రెండు తులముల వరకు.

## గుణము.

తరుణరోగములుపోవును. రక్తమును శుభ్రపరచును. నరములకు బలమిచ్చును. సెగ, సవాయి రోగములను హరించును.



## 36. భూశర్కర పానీయము.

పచ్చిభూశర్కరను తెచ్చి దంచిన రసమునుగాని, యెండినదానిపల కషాయమునుగాని వడియకట్టి దానికి చీనాకలకండను అరవీసెను చేర్చి పొయిమీదనుంచి షర్బతు పాకముగ కాచి దించి యందు యేలకులచూర్ణము శొంఠిచూర్ణమును వీనుసుకు తులమువంతున చేర్చి దించి సీసాలోభద్రపర్చవలెను.

మాత్ర తులము మొదలు ఒకటిన్నర తులము వరకు.

## గుణము.

రక్తమును శుభ్రపరచును. నరములకు బలమిచ్చును. కాంతివర్ధనము చేయును.



## 37. సారస్వత పానీయము.

సరస్వతియాకును దంచి వడియాకట్టిన రసము 30 పలములు, చీనాకలకండ 60 పలములు చేర్చి షర్బతు పాకముగ

కాచి యందు బోడతరము, శొంఠి, వసయు, చూర్ణములు చేసి దినుసుకు పలమువంతున వస్త్రగాలితముచేసిన చూర్ణము లనుచేర్చి మరియొకపాంగురానిచ్చి దించి సీసాలలో భద్రిప రచవలెను.

మాత్రి తు 1 మొదలు 2 తులములవరకు.

## గుణము.

కాలవిరేచనముజేయును హృదయమునకు, మెదడునకును బలముచేయును. బుద్ధిబలము నిచ్చును. నాలుకను పలచనగజే యును. కవిత్వధోరణిని బుట్టించును. వేయేల గంగాప్రవాహ మువలె వాణి జిహ్వాగ్రిమున నృత్యము చేయుచుండును.



## 39. తియ్యాకంద పానీయము.

తియ్యాకందను దంచి తీసినరసమును వడపోసియుంచినది 30 పలములు, చీనాచక్కెరను 60 పలములు చేర్చి తేనెపా కముగకాచి యందు నల్లకల్వగడ్డల చూర్ణము 3 పలములను చేర్చి దించి సీసాలయందు భద్రిపరచవలెను.

మాత్రి 2 పలములు మొదలు 3 పలముల వరకు.

## గుణము.

మూలశంకలు హరించును. ఆసన రక్తస్రావములు కట్టు ను. పే.హశాంతి చేయును.



## 39. శతావరి పానీయము.

శతావరి పచ్చిదియైన యెడల దంచి రసముదీసియు వొలిచి యీనెలుతీసిన యెండు చీలికలైనయెడల కషాయమును కాచియు వడియగట్టిన రసముగాని, కషాయముగాని 15 పలములు, 30 పలముల చీనాచక్కెరయు షర్బతుపాకముగ గాచి యందు పచ్చకర్పూరము కుంకుమపూవు, దినుసుకు తులమువంతున పన్నీరుతోనూరి యందుచేర్చి దించి సీసాలలో చేర్చి కారుకులు బిగించి యుంచవలెను.

మాత్రి అరపలము మొదలు పలమువరకు వలయు. పాలలో చేర్చి త్రాగవలెను.

### గుణము.

ఇంద్రియమూటవలె యూరును. స్తంభనము పుష్టియు గలిగించును. పలచనైనశుక్లము గట్టిపఱుచును. శుక్లమేహము, శిష్టమేహములు హరించును. కాంతి నిచ్చును.



## 40. తేనె షర్బతు,

తేనె 60 తులములు శుభ్రమైననీళ్ళు 13 తులములున్ను కలిపి ప్రొయిమీదనుంచి క్రిందమంటవేయుచు నందు, శొంఠి, కలువంజీలు, లవంగాలు, రూమీమస్తకి, పుదీనా, అకల్కరర్రియు దినుసుకు తులమువంతున బాగుగ నలియగొట్టి పలచనిగుడ్డలోకట్టి యామూటను పైపాకములోవిడిచి కని

[illegible]బెట్టుచు పానీయపాకముగా వచ్చినపుడు దించి చల్లార్చి కార్కుగల సీసాలలో జాగ్రతచేయవలెను.

మాత్ర తులము మొదలు రెండు తులములవరకు సేవింప వచ్చును.

### గుణము.

అర్ధాంగవాతము, కంపవాతము, అజీర్ణము, మొదలగు శ్లేష్మరోగములును, పైత్యవికారములును హరించును.



## 41. బిల్వఫల పానీయము.

బాగుగపండిన మారేడుపండ్లను పగులగొట్టి లోపలి గుజ్జును తీసి 30 పలములను 30 పలముల నీళ్ళు మరుగుచుండగ పైగుజ్జును చేతితో యుడికించి దించి చల్లాచితో బాగుగ పిసికి పిప్పిని పారవైచి వడియకట్టిన ద్రావకమునందు 30 పలముల చీనాచక్కెరను చేర్చి పొయిమీదనుంచి మరుగుచుండగనందు యాలకులు, లవంగములు, చలవమిరియాలు, చందనపుపొట్టు, దాలిచినియు దినుసుకొక తులమువంతున చూర్ణించి పాకమున జేర్చి తేనెపాకముగ వచ్చునపుడు దించి వడియకట్టి సీసాలలో చేర్చవలెను.

మాత్ర 1 తులము మొదలు 2 తులములవరకు.

### గుణము.

పైత్యవికారములు, నిద్రాకలు, మేహజ్వరములు లోనగునవి హరించును.



## 42. చంద్రకాంత షర్బతు.

చంద్రకాంత విత్తులు 1౦ పలములు దంచి 20 పలముల నీళ్ళలో కషాయమును కాచుచు అందు రేవలిచిన్ని, సోపు, నాగకేసరాలు, జీలకర్ర, కచ్చూరాలు, పటికె, సురాకారము, లవంగాలు, యాలకులు, కవిరియు జినుసుకు తులమువంతునచూర్ణించి చేర్చి షర్బతుపాకముగ వచ్చునపుడు దించి వడియకట్టి సీసాలో భద్రపర్చవలెను.

మాత్ర పావుతులము మొదలు అరతులము వరకు గ్రుడ్డిషు శుద్ధోదకమున చేర్చి త్రాగవలెను.

### గుణము.

సెగజాతులును, మేహ... గులును హరించును.



## 43. ప్రాచికపండ్ల షర్బతు.

ప్రాచికపండ్లు 10 పలములు మరుగునీళ్ళు 10 పలములలో చేర్చి బాగుగ పిసికి పిప్పిని పారవైచి యందు 20 పలములపంచదారను చేర్చి షర్బతుపాకముగ కాచి దించి వడకట్టి సీసాలోపోసి యుంచవలెను.

మాత్ర ½ పలము మొదలు పలమువరకు.

### గుణము-

విరేచనకారియగును. నోటికిరుచించును. అరుచిని అగ్నిమాంద్యమును బోగొట్టును.



## 44. అనాసపండ్ల షర్బతు.

బాగుగపండిన అనాసపండ్లను పైపెచ్చునుదీసి లోపలిప దార్థమును దంచి రసమునుపిండి వడియకట్టవలెను. ఆరసము 15 పలములు చీనాచక్కెర 30 పలములను చేర్చి షర్బతు పాకముగకాచి యందు యాలకుల చూర్ణమొక తులముచేర్చి మూతవేసి దించి సీసాలోపోసి కార్కు బిగించవలెను.

మాత్ర 1 పలము మొదలు 2 పలములు.

### గుణము.

ఈ షర్బతును వేసవికాలమున భోజనాంతరమున సేవించిన చలవచేయును. ఉష్ణదేహులకు చాలపనిచేయును. శీతలదేహు లకు బాధించును. అరుచిని తొలగించును.



## 45. వాజీకర పానీయము.

శతావరి దుంపలు, పల్లేరువేళ్ళు తీటకసిందవిత్తులు, బీర విత్తులు, అడవిపత్తి విత్తులు, నీరుగొబ్బివిత్తులును, దినుసుకు 5 పలములవంతున దెచ్చి చితకగొట్టి 30 పలముల శుద్ధోదము లోచేర్చి కాచి వడపోసిన కషాయమును తిరుగ పాత్రయిబోడ నుంచి యందు 50 పలములు చీనాచక్కెరనుచేర్చి షర్బతుపా కముగ కాచి దించి సీసాలలో భద్రపర్చవలెను.

మాత్ర 1 తులము మొదలు రెండు తులముల వరకు వాడ వచ్చును.

## గుణము.

ఈపానీయమును రాత్రి భోజనాంతరమున త్రాగుచున్న, ఆవుపాలతో సేవించుచుండిన లింగము వృద్ధిబొంది యనేక యువతులతో భోగించుశక్తి గలుగును. శుక్లమూరును. స్తంభించును.



## 46. కలకండ షర్బతు.

వాకుడు, ఉచ్చింత, ఏనుగపల్లేరు, నల్లేరు, ఉత్తరేణి, తిప్పతీగె, అవిశెచెట్టుబెరడు, వేపబెరడు, కరివేపబెరడు, ఉసిరికె బెరడు, జీలకర, ధనియాలు, కరకాయలు, ఉసిరికెయొలుపు, ఓమము ను దినుసుకు 1 పలమువంతున 15 పలములు, 60 పలముల శుద్ధోదకము, కలకండ 40 పలములు.

### చేయువిధము.

పైదినుసులను శుద్ధోదకమునచేర్చి నాల్గవవంతు మిగులునట్లు శ్లేష్మపైత్యములకును, ఎనిమిదవభాగము మిగులునట్లు శ్లేష్మవాతములకును పదునారవపాలు మిగులునట్లు ప్రినూతి మేహములకును కషాయముసుకాచి వడియకట్టి సోలడు కషాయమును భగోణి (మూకుడు) లో బోసి పొయిమీదనుంచి యందు కలకండ నంశయుచేర్చి దీపాగ్నిని షర్బతుపాకముగకాచి కారుకగల సీసాలలోబోసి భద్రిపర్చవలెను.

మాత్రి అరతులము మొదలు తులమువరకు చేర్చవచ్చును.

## గుణము.

ఈపానీయమును శ్లేష్మపైత్య సంబంధమైన సంజురోగము లకును, శ్లేష్మవాతయుబ్బు రోగములకును. పరిసూతి మేహరోగములకును ఉదయ సాయంకాలములయందు మండూరము నుగాని, లోహమునుగాని, తిభీరక మలదూరమునుగాని చేర్చి యిచ్చుచుండిన నివారణమగును. ఔషధములను చేర్చకున్నను పనిచేయును.



## 47. ఉలవిత్తుల షర్బతు.

ఉలవిత్తులు 3 పలములు, మిరియాలు 3 పలములు 16 పలముల శుద్ధోదకమునచేర్చి ఎనిమిదవ వంతునమిగులునట్లు కషాయమునుకాచి యందు 8 పలముల చక్కెరనుచేర్చి తేనెపాకముగ వండి వడపోసి సీసాలలో జాగ్రతచేయవలెను.

మాత్ర తులము మొదలు రెండుతులములవరకు.

## గుణము.

ఈ షర్బతును ఆవునెయ్యికలిపి మూడుదినములు రెండువేళల సేవించిన శూలలన్నియు హరించును.



## 48. తంగేడు షర్బతు.

నేలతంగేడు వేరు బెరడు, ఆకు, పువ్వు, కాయ, చిగురు, ఎట్టిని దినుసుకు రెండు పలములువంతున రోటనుదంచి, 20 పల

ములు మంచినీళ్ళలోవేసి 5 వ పాలుమిగులునట్లు కషాయము ను కాచి వడియకట్టి యుంచవలెను.

మాత్ర పావుతులము మొదలు అరతులమువరకు తేనెలో కలిపి సేవించవలెను.

## గుణము.

మేహసంబంధమైన కడుపునొప్పులు హరించును. అతి మూత్రములు కట్టును.

పథ్యములను శుద్ధోదకమునగాని పాలయందుగాని వేసి త్రాగవలెను.

పానీయకల్పవల్లి.

సంపూర్ణము.

